# ఆడషాంకు.

---

పబ్లిషర్సు, రంగా కృష్ణమ్మగారి కుమారుడు
వెంకటరత్నం.




---

బుక్కుసెల్లర్సు అండ్ పబ్లిషర్సు, బెజవాడ.

 1921 వెల 0-1-0.

---

వాణీ ముద్రాక్షరశాల, బెజవాడ.

# ప్ర క ట న.

మావద్ద అనేకరకముల సంస్కృతాంధ్ర గ్రంథములు, వైద్యగ్రంథములు, నాటకములు, నవలలు దొరకును. భారీగాకొనువారికి మంచికమీషను ఇవ్వబడును.

నాటకములు.

| | |
|---|---|
| సంపూర్ణరామాయణము | 1-4-0 |
| సంపూర్ణోత్తరరామాయణము | 1-0-0 |
| సావిత్రి | 0-12-0 |
| పాదుకాపట్టాభిషేకము | 0-12-0 |
| వేశ్యామధురము 2వ భాగము | 0-6-0 |
| గయోపాఖ్యానము | 0-8-0 |
| ప్రసన్నయాదవము | 0-8-0 |
| పార్వతీపరిణయము | 0-8-0 |
| పద్మినీలోకబాంధవము | 0-12-0 |

# ఆధునిక షోకు

సీ॥ మోమునఁగుంకుమ । మోటాయె మసిబొగ్గు
వలెనుండు చుక్కయే । ప్రబలిపోయె,
మొప్పుగాఁ దలదువ్వి । కొప్పువెట్టుట వెగ
టాయె ముచ్చటముడు । లలరనాయె,
కులధర్మమునుబూని । గోచిపెట్టిన చీర
కట్టుపోయెను నడ్డ । కట్టు కుదిరె,
తిన్నగా పావిట । దిద్దుట వళియించె
పెడపావిటలె కడు । వృద్ధిఁగాంచె,
తే. గీ॥ పసుపు బరువాయె రోజ్పౌను । పౌడరొప్పె,
సున్నిపిండియుఁ జేదయ్యె । సోపువచ్చె,
కాలమంతయు మారెను । కాంతలకును,
క్రొత్తక్రొత్త షోకులు వచ్చెఁ । గొంపదీసె॥

సీ॥ కొప్పు పెట్టుట యాఁదు । గొప్ప విసుగు పుట్టె
ముప్పేట జడపైన । మోజు ప్రబలె,
సంచియల్లుడుపైన । జాల కోరిక పుట్టె
ముచ్చట ముడిపైన । ముచ్చ టాదనె,
దవనసంపు జడపైన । దవిలె కోరిక కీలు
జడయున్న గడుసంత । సాఁబుగలిగె,
ఈతాకు తాటాకు । ఇంగ్లీషుబాదాము,
రౌస్జడలన్నను । నింపు పుట్టె,
తే. గీ॥ బిళ్లచుట్టయు మఱి కొండి । వేళ యనిన,
జరమ హర్ష మొదవె నింకఁ । దరుణులందు,
నెన్ని షోకులు ప్రబలునో । యెంచిచూడ,
గాలచక్రమీలీలను । గ్రాలుచుండె॥

సీ॥ అందెలు కడియాలు । సందుసందులఁ జేరె
బెంగుళూర్పట్టాలు । వృద్ధిఁగాంచె,
ముడివేయు రపికెలు । కడుమోటు తనమాయె
జాకెట్టుమోజుల । షోకు ప్రబలె,

గాజులు దొడుగుట । కంటికగపడదు,
మంగళూర్ గాజుల । మహిమ హెచ్చె,
పూర్వకాలపు నగల్ । మోటాయె నెంతయు,
వింతవింత నగలు । వెలసె నెన్నొ,
తే. గీ॥ నల్లపూస లనెడి మాట । నాస్తి యమ్మొ,
నిన్న జూచిన వేషంబు । నేడు లేదు,
ప్రతిదినము క్రొత్తపోకలు । ప్రబలుచుండె,
జెప్పశక్యము యిక్కాల । స్త్రీల యందు॥

సీ॥ విధవలౌ కొందరు । వెలదులు ప్రాపింగు
వలెఁ దల నుంచుక । వెలుగుచుండ్రి
యుంగరంబులరీతి । నుంచుటే పోకని
కొందరుకాంతలు । కోరుచుండ్రి,
చెంపప్రక్కలయందు । నింపుగా గొరిగించు
కొనుట పోకని కొంద । రనుచునుండ్రు,
జడ వేసి కుచ్చులు । చక్కగా బెట్టుట,
యింపని మరికొంద । రెంచుచుండ్రు,

తే. గీ॥ రవునుముడి వేసి చుట్టును । బువ్వులదండ,
దాల్చుటయె షోకటంచును । దలచుచుంద్రు,
కొంద ఱేమందుదీనికిఁ । గ్రొత్తక్రొత్త,
షోకులు ప్రబలె నీకాల । సుదతులందు॥

సీ॥ ధవళవస్త్రము నెప్డు । ధరియింపగా బోదు
ధన్యురా లైనట్టి । ద్రవిడకాంత,
కొప్పునెప్డు ముడువఁ । గోరదు చూడంగ,
గర్నాటదేశపు । కాంతమిన్న,
కచ్చనెప్పుడు గట్ట । గాదలపోయదు,
గుజరాతిదేశపు । సుందరదన,
చీరెను నెప్పుడు । జెలువొప్పగట్టదు,
మార్వారుదేశపు । మగువమిన్న,
తే. గీ॥ అన్నిదేశంబులందున్న । యువతులెల్ల,
తమ మతాచారధర్మముల్ । దలచుచుంద్రు,
కాని యది యేమి చిత్రమో । క్ష్మాతలమున,
యాంధ్రభామిని యందఱె । ననుకరించు॥

సీ॥ పాటబాడిన మఱి । పాడలేకున్నను,
హార్మోనియం బుండి । యలరవలయు,
చదివిన, లేకున్న, । జదలు పట్టుటకైన,
గ్రంథంబులను గల్గి । గ్రాలవలయు,
యిచ్చిన, లెక్చరు । నీయక యుండిన,
సభలకు, దప్పక । చనఁగ వలయు,
తెలిసినను మఱియు । దెలియకుండిన,
నాటకంబుల నెప్పుడు । గాంచవలయు,
తే. గీ॥ పనియుఁ బాటయు లేకున్నఁ । బమగు రక్క-,
లమ్మలను జేర్చిసంభావ । ణమ్ముసల్పు,
చుండ వలయును లేకున్న । సుదతి కాదు,
సుదతులను నేటికాలపు । పోకులివియె ॥

సీ॥ కర్ణంబులం దున్న । కమనీయతాటంక,
కాంతులు మిగుల ప్ర । కాశమంద,
నీలంబులను మించి । నెగడు కుంతలములు,
చిన్నారి మోము పై । జిందులాడ,

ఘనరత్న మాణిక్య । కాంచనహారముల్,
గబ్బిగుబ్బలపైన । గంతు లిడఁగ,
ముంజేతి కంకణం । బులధ్వని, పలుమారు,
కణకణ యంచును । గ్రాలుచుండ,
తే. గీ॥ చీరచెఱగు భూమిపయిన । జిందుద్రొక్క,
సోగచూపుల చూచుచు । సారసాక్షి,
యొకతె, నాటకశాలయమున । కొప్పమీఱ,
నేగుచున్నది విటచిత్త । మూగులాడ.

సీ॥ కడియాలచప్పుడు । గానరాకుండఁగా,
పైభాగమున లాగి । పట్టియుంచి,
విరుదుల నంటెడి । కురులను ముడివేసి,
వరబెంగుళూర్ రుమాల్ । పాగ జుట్టి,
కరకంకణధ్వని । గాని పించు నటంచు,
గట్టిగా గుడ్డచేఁ । గట్టు కట్టి,
పురుషుఁడే యనుభ్రాంతి । నొడము చందంబున,
బాగైన తెల్లధో । వతిని దాల్చి,

తే. గీ। మిలిటరీకేను నొక్కటి / లలితగతిని,
హస్తమందున బూని, ప్ర / శస్తమైన,
సిజరు సిగరెట్టు గాల్చుచు / శీఘ్రగతిని,
బురుషు డనునట్లు జనుచుండె / బాలతియొక తె।

సీ। చూడ నసహ్యాంబు / చూపట్టు మోమున,
పవుడరు నొక్కింత / పామిపామి,
కురులు లేకున్నను / గురులున్నవని తెల్ప,
సవరంబుతో నెంతొ / సాగదీసి,
రజకునిఁ బ్రార్థించి / రహిదెచ్చుకొని నట్టి,
ఘనమైన చీర. నొ / క్కటి ధరించి,
వింతవింతల గొల్సు / విక్టోరియాడిపో,
గిల్టువస్తువులను / గీలుకొల్పి,
తే. గీ। యేరినైనను వంచింప / నెంచి; బాట,
సారుల కొంటెఁ జూచుచు / చాన యొక తె,
రైళు లన్నియు వచ్చెడి / వేళయందు,
జేర బెజవాడ రైలుస్టే / షనునకు।

సీ॥ సరస మైనట్టి భా । వణముల చేతను,
సభ్యు లానందాబ్ధి । జలకమాడ,
శ్రావ్యమైనట్టి మేల్ । సంగీత మాలించి,
తద్దయు చూపరుల్ । తలలుద్రిప్ప,
ఘుంజేత నున్నట్టి । ముద్దైనకంకణం,
బులధ్వను, లలతాళ । ముగతి చెలంగ,
భావంబు లన్నియుఁ । బ్రకటించుటకు గాను,
హస్తముల్ రెండును । నాడుచుండ,
తే. గీ॥ చిత్తమందు వెలుపు సింత । చేర్చుకుండ,
పురుషుడా యను భ్రాంతియుఁ । బొల్పెసంగ,
చెప్పుచున్నది హరికథ । నొప్పుగాను,
కీరవాణియౌ నెల్లూరు । కృష్ణవేణి॥

సీ॥ ముంజేత, తోడాలు । మురుగులు గొల్సులు,
నతి కాంతు లీనుచు । నమరియుండ,
మెడలోన నున్నట్టి । మేలిమి బంగారు,
నాను పేరులు రంగు । లీనుచుండ,

రవలచే నొప్పారు । రమ్యమై తనరారు,
ముక్కుపుడక లెంతో । మురిసియాడ,
నీలంబులకు నిగ్గు । నెగడజేసెడి మేటి,
కురుల ముడి ముదము । గొలుపుచుండ,
తే. గీ॥ ముత్తయిదో లేకముండరో । బోల్చలేని
భంగి, బండినెక్కగ ప్లాటు । ఫారమందు,
ట్రంకు నొక్కటి హస్త । మందునమర,
వేచియున్నది పెద్దక్కతో । వెలదియొక తె॥

సీ॥ మగవారి రీతినే । మగువలందున స్వతం,
త్రత యుండ వలెనంచు । దలచు వారు,
పురుషుల భంగినే । పొలుపార నుద్యోగ,
ముల జేయవలె నంచు । దలచు వారు,
పురుషులతో గూడి । పరమ ముదమున బం,
తులనాడ వలెనంచుఁ । దలచు వారు,
భర్తలతో గూడి । బైసికిల్ పైరుకు,
దరలంగ వలెనంచుఁ । దలచు వారు,

తే. గీ॥ సభలయందున గొప్ప లె । క్చరులనీయ,
వలయు నంచును నిరతంబు । దలచువారు,
కలిగి, యొప్పుచుండిరి నేటి । కాలమందు,
స్త్రీలు, దీనికి మూలంబు । గాలమహిమ॥

